





# కథలు

## నీతి, పురాణ, పొడుపు

# యథారాజా తథాప్రజా





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120033143

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# యథారాజా తథాప్రజా

గంగిశెట్టి శివకుమార్



ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

బర్కత్‌పురా, హైదరాబాదు-500 027.

# మనవి

బాల వాఙ్మయంలో కథా సాహిత్యం కమనీయమైనది, కర్ణపేయమైనదీని! మాటలు నేరుస్తూ, మాటలను అర్థం చేసికోగల శక్తి అలవడుతూ వున్న తరుణం నుండీ, బాలలను ముందుగా ఆకర్షించేది కథా సాహిత్యమే!

బాల కథా సాహిత్యం ఒక పాటిది కాదు, అది ఆది, అంతూ లేకుండా అవిచ్ఛిన్నంగా సాగిపోతూ వుండినది, ఉంటున్నదీ కూడా! ఈ కథా సాహిత్యంలో అద్భుత రసానికి చెందిన కథలకు అగ్ర తాంబూలం ఉంటుంది. ఆ అద్భుత రసానికి చెందిన కథలలో జానపద కథలదే అగ్ర స్థానం!

జానపద గాథలు ఆబాల గోపాలాన్నీ అలరిస్తాయి. జనన తేది తెలియని ఈ కథలకు జన్మ స్థలం కూడా ఏదో తెలియదు. అవి విశ్వ వ్యాప్తమైనవి. అన్ని విషయాలను తమలో ఐక్యం చేసికొనగల విశాలత్వం ఈ కథా సాహిత్యానికి ఉన్నది.

అసలు ఈ రకమైన కథలకు జీవనాడి అందలి కథా భాగానికి చెందుతుంది. ఆ తరువాత, ఆ కథలను చెప్పు నేర్పు తీర్పులను బట్టి అవి జీవిస్తూ ఉంటాయి!

అనుశ్రుతంగా వచ్చినవి అయినా, లేక, అప్పటికప్పుడు అల్లి చెప్పేవి అయినా, వాటిలో ఉండే చమత్కారాన్ని బట్టి, చెప్పేవారి చాతుర్యాన్ని బట్టి ఈ కథలు రాణిస్తాయి, అందరినీ ఆకర్షిస్తాయి; మరపురాని ముద్ర వేస్తాయి, చివరకు తర తరాలు ఇంటింటా నిలిచి ఉంటాయి!

ఈ కథలను చెప్పడమెంతో, వ్రాయడమూ అంతే! ఈ రంగంలో కలం సాము చేసి, కండ పుష్టిని సంపాదించిన వారు చాలా కొద్దిమందే కనపడతారు. అట్టి వారి కథల యెడల, అట్టి కథలను ప్రచురించే పత్రికల యెడల ప్రజలు చూపే ఆదరణను గమనించి నట్లయితే, ఈ కథా వాఙ్మయానికి గల ప్రాచుర్యం బోధపడుతుంది.

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ప్రచురించ నుద్యమించిన 'బాల సాహిత్య సర్వస్వం'లో భాగంగా తమ కథలను వెలువరించడానికి సహకరించిన శ్రీ గంగిశెట్టి శివకుమార్ గారికి బాలల అకాడమి తన కృతజ్ఞతలను తెలియజేస్తున్నది.

—ఏడిద కామేశ్వరరావు
సంపాదకుడు

# విషయ సూచిక




# యథా రాజా తథా ప్రజా

పూర్వం విజయపురిని ఏలిన విక్రమసింహుడు పరిపాలించటంలో సమర్థుడు. ఆయన వద్ద తెలివిగల మంత్రులుండేవాళ్లు. ఆయన రాజ్యం సుఖశాంతులతో ఓలలాడేది.

ఒకసారి రాజు తన రాజ్యంలో పర్యటన చేస్తూండగా ఒక మారుమూల గ్రామంలో అతి ప్రాచీనమైన సోమనాథ దేవాలయం కనిపించింది. అనేక శతాబ్దాల క్రితం ఉచ్ఛదశలో ఉండిన ఆ దేవాలయం ఇప్పుడు శిథిలమై ఉన్నది.

ఆ దేవాలయాన్ని ఆ స్థితిలో చూసేసరికి రాజుకు ఎక్కడలేని విచారం కలిగింది. ఆ ఆలయాన్ని ఏ విధంగానైనా పునరుద్ధరించి, పూర్వపు ఖ్యాతిని తీసుకురావాలని రాజు నిర్ణయించాడు.

ఈ విషయమై ఆయన మంత్రులతో ఆలోచిస్తే, దానికి చాలా ఖర్చు అవుతుందని వాళ్ళు అన్నారు. ఆలయాన్ని పునరుద్ధరించటమే గాక, దానిక్రింద మాన్యం ఏర్పాటు చెయ్యాలి. ఆ గ్రామాన్ని అభివృద్ధి చెయ్యాలి. యాత్రికుల సౌకర్యం కొరకు అనేక సదుపాయాలు చెయ్యాలి. ఆలయానికి ఖ్యాతి వచ్చేదాకా దాన్ని రాజధనంతోనే పోషించాలి.

"ప్రస్తుతం మన కోశంలో అంత ధనం లేదు మహారాజా! కొన్నాళ్ళు వాయిదా వేద్దాం" అన్నారు మంత్రులు.

"అనుకున్నప్పుడు చెయ్యకపోతే ఆ ఆలయాన్ని పునరుద్ధరించటం ఎన్నటికీ జరగదు. ఈ ఖర్చుకోసం కొత్త పన్ను ఒకటివేద్దాం. దాన్ని ధనికుల మీదా, వర్తకుల మీదా మాత్రమే వేస్తే, వాళ్ళు ఇచ్చుకునే స్థితిలో ఉంటారు. సామాన్య ప్రజలను మనం బాధించ నవసరం లేదు" అన్నాడు రాజు.

మంత్రులు ఈ ఆలోచన బాగున్నదని, మర్నాడే కొత్త పన్ను గురించి చాటింపు వేయించారు.

ఏదైనా కొత్తశాసనం ప్రకటించినప్పుడు రాజు మారువేషంలో నగరమంతా తిరిగి, ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకునేవాడు. ఆ ప్రకారం ఆయన చాటింపు జరిగిన మర్నాడు మారువేషంలో వీధులవెంట తిరగసాగాడు.

మధ్యాహ్నంవేళ ఒక దుకాణంముందు నిలబడి ఒక యువకుడు దుకాణదారుతో ఘర్షణ పడుతూ ఉండటం రాజుకు కనిపించింది. ఆ యువకుడి మాటలనుబట్టి అతను ఒక ధనికుడి వద్ద పనిచేస్తున్నాడనీ, కొత్త పన్ను వచ్చిపడిన కారణంచేత ఆ ధనికుడు యువకుడి జీతం తగ్గించాడనీ, ఆ యువకుడు అసలే రాబడి తగ్గి బాధపడుతూ ఉంటే, అతను ఇంటికి కొనవలసిన సరుకుల ధరలను వర్తకులు పెంచారనీ రాజుకు అర్థమయింది. రాజు చూస్తూ ఉండగానే ఆ యువకుడు తనకు కావలసిన సరుకులు సగం సగం మాత్రమే కొనుక్కొని వెళ్ళి పోయాడు.

రాజు అనుకున్నది తారుమారు అయింది. తాను ధనికుల మీదనే పన్ను వేశానని ఆయన అనుకున్నాడు. కాని పన్నుల భారాన్ని ధనికులు మోయక, సామాన్య ప్రజలమీదికే తోసేశారు!

రాజు తన ఇంటికి తిరిగివెళ్ళి మంత్రులతో, "కొత్త పన్ను వెయ్యటం లేదని మళ్ళీ చాటింపు వెయ్యండి. ధరలు పెంచిన వారిని కఠినంగా శిక్షిస్తామని ప్రకటించండి" అన్నాడు.

ఆయన తన మంత్రులకు తాను చూసిన విషయం చెప్పాడు.

"అలా అయితే ఆలయం పునరుద్ధరించే ప్రయత్నం మానుకున్నట్టేనా?" అని మంత్రులు రాజును అడిగారు.

"లేదు, లేదు! ఆలయం పని ఎన్నటికీ మానను, అందుకు అయ్యే ఖర్చు నేనే భరిస్తాను. ఎలాగంటారా? రాజభవనంలో నిత్యమూ అంతులేని వృథా ఖర్చు జరుగుతున్నది. వేట కింద, వినోదాల కింద

అంతులేని డబ్బు ఖర్చయిపోతున్నది. రాజ కుటుంబం సామాన్య ప్రజలలాగా జీవించినట్టయితే దేవాలయాన్ని బాగుచెయ్యటం సాధ్యమవుతుంది. ఆలయం పని పూర్తి అయేదాకానైనా ఈ దీక్ష కొనసాగిస్తాను'' అన్నాడు రాజు.

మంత్రులు ఆ మాట విని నిర్ఘాంతపోయి, ''మహారాజా! మేము కూడా విందులు, వినోదాలు మాని, మా ఖర్చులు తగ్గించి, దేవాలయానికి తోడ్పడుతాం'' అన్నారు.

ఈ మాట విని రాజు సంతోషించాడు. మంత్రులు తామై తమ జీతాలలో హెచ్చుభాగం దేవాలయ నిధికింద ఇచ్చేశారు. రాజోద్యోగు అందరూ ఇలాగే చేశారు. ఈ వార్త నగరమంతా పొక్కిపోయింది. ప్రజలు నగరపు వీధులన్నిటిలోనూ హుండీలు ఏర్పాటు చేశారు. అందులో డబ్బు పడసాగింది.

ఇదంతా చూసి వర్తకులకూ, ధనికులకు ఎంతో సిగ్గయింది. వాళ్ళు తమలో తాము పోటీపడి దేవాలయ నిధికి పెద్ద పెద్ద మొత్తాలు విరాళాలుగా ఇచ్చారు.

ఈ విధంగా అంతులేని ధనం పోగయింది. సోమనాథ దేవాలయం పూర్వం కన్న గొప్పగా తయారయింది. దేవస్థానానికి అవసరమైన హంగులన్నీ ఏర్పడ్డాయి. త్వరలోనే అది ప్రసిద్ధమైన యాత్రాస్థలంగా మారిపోయింది.





# కష్టనష్టాలు

రామనాధుడు ఆ ఊళ్ళో మోతుబరి రైతు. అతని ఏక పుత్రుడు సోమనాధుడు పెద్ద చదువులు చదివి, ఇంటికి తిరిగివచ్చాడు. వ్యవసాయం తన కొడుక్కు అప్పగించి తాను విశ్రాంతి తీసుకుందామనుకున్నాడు రామనాధుడు.

కాని సోమనాధుడికి వ్యవసాయం చేయాలని లేదు. అతను తన తండ్రితో, "వ్యవసాయం అంత లాభసాటి కాదు. కష్టపడి

నందుకు తగిన ఫలితం ఉంటుందనుకోవటానికి వీలులేదు. అతివృష్టి, అనావృష్టి ఏర్పడి శ్రమ అంతా బూడిదపాలు కావచ్చు'' అన్నాడు.

కొడుకు మాటలకు నివ్వెరపోయి రామనాధుడు, ''అయితే ఏం చేయాలని నీ ఉద్దేశం? ఆ విధంగానే చేయి'' అని అన్నాడు.

సోమనాధుడు ఆ ఊళ్ళోనే లక్షలమీద వ్యాపారం చేస్తున్న ఒక ప్రముఖుణ్ణి కలుసుకుని, ''ఏ విధమైన వ్యాపారం లాభసాటిగా వుంటుందంటారు?'' అని అడిగాడు.

వ్యాపారి నిట్టూర్చి, ''ఏం వ్యాపారం, నాయనా? చదువుకున్న వాడివి. చూస్తూ చూస్తూ, ఈ రొంపిలో ఎందుకు దిగుతావు? వ్యాపారం వెనకటి అంత లాభసాటిగా ఉండటం లేదు. వ్యాపారస్థులు జాస్తి అయారు. పోటీ హెచ్చింది. వ్యాపారం చేసుకునే వాడికి సుఖంలేదు, శాంతిలేదు'' అన్నాడు.

వ్యాపారంలో గల కష్టనష్టాలను గురించి వివరంగా విన్నాక సోమనాధుడికి వ్యాపారం మీద విముఖత్వం పుట్టింది.

అతను అక్కడినుండి తిన్నగా నగరానికి వెళ్ళి, అక్కడ ఉన్న ఒక ప్రముఖ రాజోద్యోగిని కలుసుకుని, తన విషయమంతా చెప్పి, రాజుగారి కొలువులో తనకు ఏదన్నా ఉద్యోగం ఇప్పించ మన్నాడు.

రాజోద్యోగి ఇలా చెప్పాడు:

''ఎందుకు నాయనా, రాజుగారి కొలువు చేస్తానంటావు? రాజు గారి దివాణంలో ఉద్యోగం చెయ్యటమంటే కత్తిమీద సామే! రాజు గారికి అనుగ్రహం కలిగినా, ఆగ్రహం కలిగినా మనకు ప్రమాదమే.

ఆత్మాభిమానం చంపుకుని నౌకరీ చెయ్యాలి. ఎంత చేస్తే మాత్రం ఊరా? పేరా? చదువుకున్నావు; తెలివితేటలున్నాయి. భూములున్నా యంటున్నావు! నీ తెలివితేటలు వ్యవసాయంలో చూపినావంటే, నువ్వింత తిని, పదిమందికి ఇంత పెట్టగలుగుతావు. ఉద్యోగాల బ్రతుకులు చాలీచాలని బతుకులు! గాడిద బతుకులు! ఇంతాచేసి ఉద్యోగం దొరకటమంటే మాటలు కాదు!''

రాజోద్యోగి చెప్పిన మాటల్లో నిజం ఉన్నదని సోమనాధుడికి తోచింది. అతను ఇంటికి తిరిగి వచ్చాడు.

ముఖం వేలాడవేసుకుని వచ్చిన కొడుకును చూసి రామనాధుడు విషయం అడిగి తెలుసుకుని ఇలా అన్నాడు:

''నువు ఒక్క వ్యవసాయంలోనే కష్టనష్టాలు ఉన్నాయనుకున్నావు. అది నీ తప్పుకాదు. నీకు వ్యవసాయం గురించి మాత్రమే అనుభవం ఉన్నది. వాస్తవం ఏమంటే, ఎక్కడ లాభమనేది ఉంటుందో అక్కడే అంతో, ఇంతో నష్టంకూడా ఉంటుంది. అలాగే సుఖం వుండే చోటనే ఎంతో కొంత కష్టంకూడా వుంటుంది. పూర్తి సుఖంతో కూడి అచ్చంగా లాభమే ఇచ్చేపని ఎక్కడా వుండదు. జీవితంలో కష్టనష్టాలు అడుగడుగునా ఉంటాయి. మనిషికి కావలసినది దీక్ష ఆత్మస్థయిర్యమూనూ. ఇవి ఉంటే ఎన్ని కష్టనష్టాలు కలిగినా వాటిని ఎదుర్కొని జయించవచ్చు.''

సోమనాధుడి మనసు తండ్రి మాటలతో కుదుటపడింది. అతను వ్యవసాయమే చేపట్టి సమర్థుడనిపించుకున్నాడు.






పూర్వం గొప్ప సిద్ధులు గల ఒక సన్యాసి తన శిష్యుడితో సహా ఒక నగరానికి వచ్చాడు. ఆ నగరంలో మణిగుప్తుకనే గొప్ప ధనవంతుడుండేవాడు. ఆయనకు అపర దానకర్ణుకనే బిరుదు వుండేది. సన్యాసి ఆ మణిగుప్తుడి ఆతిథ్యం స్వీకరించటానికి వెళ్ళాడు.

మణిగుప్తుడి ఇంటిముందు దానం స్వీకరించటానికి వేలాది దరిద్రులు నిలబడి ఉన్నారు. మణిగుప్తుడి మనుషులు ప్రతి ఒక్కరికీ డబ్బు ఇస్తున్నారు.

ఆ రోజు సన్యాసి ధనవంతుడి ఆతిధ్యం స్వీకరించి, ప్రయాణమై వెళ్ళిపోతూ, ''నీ ఆతిధ్యాన్ని మెచ్చుకున్నాను. నీ దాతృత్వం కళ్ళారా చూశాను. నువు ఏదన్నా వరం కోరుకో, ఇస్తాను. అయితే నువు కోరే వరం నిష్కల్మషంగా కోరినదైతే నెరవేరుతుంది'' అన్నాడు.

మణిగుప్తుడు వినయంగా ''మహాప్రసాదం!'' అని, ''నా జీవితాంతం ఇలాగే అవిరామంగా దానధర్మాలు చెయ్యటానికి వీలుగా తరగని సంపద ఉండేటట్టు వరం ఇయ్యండి'' అన్నాడు.

సన్యాసి చిరునవ్వు నవ్వి, తల ఆడించి శిష్యుడితో సహా బయలుదేరాడు.

దారిలో శిష్యుడు సన్యాసిని, ''గురువుగారూ, ఆ మణిగుప్తుడికి మీరిచ్చిన వరం దక్కేనా?'' అని అడిగాడు.

''ఏమాత్రం దక్కదు!'' అన్నాడు సన్యాసి.

''ఎందువల్లనో, సెలవిస్తారా?'' అన్నాడు. దానికి సన్యాసి, ''మణిగుప్తుడు నిష్కల్మషంగా వరం కోరదలిస్తే తన నగరంలో దరిద్రులు లేకుండా చెయ్యమని నన్ను కోరవలసింది. దాతగా తనకీర్తి, తన ధనమూ చిరస్థాయిగా ఉండాలన్నది నిష్కల్మషమైన కోరిక కాదు. లోకంలో చాలామంది స్వార్థపరులుగా కనిపిస్తారు. కొద్దిమంది మాత్రం మహా ఉదారులుగా కనిపిస్తారు. అలాటి వారిలో కూడా స్వార్థం ఉంటుందని లోకం సాధారణంగా గ్రహించదు. కాకులను కొట్టి గద్దలకు వేసిన చందంగా ప్రజలను పీడించి సంపాదించిన సొమ్ముతోనే సత్రాలు, చలివేంద్రాలూ కట్టించి, గొప్పదాతలుగా పేరు తెచ్చుకునే వారుంటారు. అలాటి వారి స్వార్థం పైకి కనపడదు'' అన్నాడు.

శిష్యుడు ఆశ్చర్యంలో మునిగి పోయాడు.






ఒక ఊళ్లో కామయ్య అనే వాగుడుకాయ ఒకడుండేవాడు. వాడు వాగడం తప్పితే మరోపని చేసేవాడు కాదు. కాని ఇవన్నీ కామయ్య భార్య పట్టించుకోక తనే కూలో నాలో చేసి సంసారాన్ని ఈదుకొస్తూండేది. మూడు పూటలూ తిని ఇరుగుపొరుగు వాళ్ళతో బాతాఖానీ వేయటం కామయ్య పని.

కొన్నాళ్లకు కామయ్య కబుర్లతో ఇరుగుపొరుగు వాళ్లు విసిగి పోయి కామయ్య కనబడితే ఎక్కడ మాటలు పెట్టుకుంటాడోనని తప్పించుకు తిరగటం ప్రారంభించారు. కొందరు ఆకతాయిలు కామయ్యను ఎగతాళి చేయటం ప్రారంభించారు.

ఈ సంగతంతా కామయ్య భార్యకు తెలిసేసరికి ఆమెకు చాలా బాధ కలిగింది. తన భర్త పనిచేసి సంపాదించకపోయినా ఆమె బాధపడేది కాదు. కాని అతను ఇలా నలుగురి చేత అవమానింప బడటం ఆమె భరించలేకపోయింది. కామయ్యకు నాలుగయిదుసార్లు చెప్పి చూసింది. కాని ఫలితం లేకపోయింది.

ఇహ చేసేదిలేక కామయ్యను ఒక గదిలోపెట్టి తాళంవేసింది. భోజనం వేళకు మాత్రం తలుపు తీసి భోజనం పెట్టేది, 'వాగే నోరు, తిరిగే కాలు ఊరికే వుండవు కదా!' అందుచేత రామయ్య అక్కడ గదిలో తనకెదురుగా ఉన్న గోడతో కబుర్లు చెప్పడం ప్రారంభించాడు.

ఇలా చాలా రోజులు గడిచాయి.

గోడ ఎదురు ప్రశ్నలు వేయకుండా శ్రద్ధగా వినటం మూలాన కామయ్య గోడకు తనకు తెలిసినన్ని కబుర్లు చెప్పి చెప్పి, విసిగి పోయాడు.

చివరికి కామయ్య ఒకరోజు గోడతో "నీకు ఇన్ని రోజులు ఎంతో కష్టపడి ఇన్ని కబుర్లు చెప్పాను కదా! నువ్వు మాటలాడక పోతే పోయావు కాని, కనీసం నన్ను మెచ్చుకోనన్నా మెచ్చుకోవేం?" అని ప్రశ్నించాడు.

గోడనుండి ఎటువంటి సమాధానం రాలేదు. కామయ్య పదే పదే అడిగాడు.

ఉన్నట్టుండి ఒక మెరుపులాంటిది మెరిసినట్టయి ఒక స్త్రీ ఆకారం అతనిముందు నిలబడింది.

"ఎవరు నువ్వు? నీకేం కావాలి?" అని అడిగాడు కామయ్య ఆశ్చర్యపోతూ.

అందుకామె "నేను కబుర్ల దేవతను, కబుర్లు సృష్టించటం, అక్కడినుండి ఇక్కడికి, ఇక్కడినుండి అక్కడకు ఇలా ప్రపంచ మంతా ఆ కబుర్లను చేరవేయటం నాపని. నీవు ఇన్ని రోజులు చెప్పిన కబుర్లు నాకెంతో నచ్చాయి. అందుకు బహుమానంగా ఒక బంగారు నాణెముల బస్తా యిస్తాను" అని చెప్పి మాయమయింది.

ఆమె అలా మాయమవగానే కామయ్య ప్రక్కనే బంగారు నాణేల బస్తా పడి ఉంది. కామయ్య ఆశ్చర్యం అంతా ఇంతా కాదు.

తలుపు తట్టి భార్యను పిలిచి అంతా చెప్పి నాణెముల బస్తాను భార్యకు చూపించాడు. భర్త ప్రయోజకుడైనందుకు ఆమె చాలా సంతోషించింది.

అప్పటినుండి కామయ్య సంసారం హాయిగా గడుస్తూంది. కామయ్యను వాగుడుకాయ అని ఎగతాళి చేసేవాళ్లలో ఒకడైన పక్కింటి రామయ్యకి వున్నట్టుండి కామయ్య ధనికుడు కావటంతో కన్ను కుట్టింది. విషయం ఎలా ఆరా తీయాలా అని ఆలోచించి రామయ్య ఒకసారి కామయ్య భార్యలేని సమయం చూచి కామయ్యను చల్లగా మాటల్లోకి దింపి అడిగాడు-'నీ కింత డబ్బు ఎలా వచ్చింది?' అని.

ముందే మాటకారి అయిన కామయ్య పూసగుచ్చినట్టు అంతా చెప్పేశాడు. రామయ్యకు దురాశ కలిగింది. తను కూడా అలా చేసి డబ్బు సంపాదించాలనుకున్నాడు.

ఇంటికి వెళ్లి తన భార్యతో చెప్పి గదిలో కూర్చుని, తలుపులు వేయించుకున్నాడు.

ఎదురుగా ఉన్న గోడతో కబుర్లు చెప్పటం ప్రారంభించాడు.

రామయ్య కష్టజీవి. అందువల్ల మాటల్లో నేర్పరితనం లేదు. అతను చెప్పిన వాటిలో చాలావరకు చెత్త కబుర్లు. కొన్ని రోజులకు కామయ్యలాగే రామయ్యకూడా విసిగిపోయి గోడని పలకరించాడు.

రామయ్య ఎదుట కబుర్ల దేవత ప్రత్యక్షమయింది. ఆమె కళ్లు కోపంతో ఎర్రబారి ఉన్నాయి. "రామయ్యా! దురాశతో నీవు కబుర్లు చెప్పబోయి చెత్త చెత్త కబుర్లు చెప్పి నాకు తలనొప్పి తెప్పించావు. ఇలా నిన్ను వదిలేస్తే ఎంతమందికి తలనొప్పి తెప్పిస్తావో? అందుకని నిన్ను మూగవాడిగా చేస్తాను'' అంది.

రామయ్యకు ఏడుపు ముంచుకొచ్చింది. తన దురాశకు తగిన ఫలితం లభించిందని బాధపడి ఆమె కాళ్లమీద పడి, ఇంకెప్పుడూ ఇలాంటి పని చేయనని లెంపలు వేసుకున్నాడు.

కబుర్ల దేవత అతన్ని క్షమించి మాయమయి పోయింది.



# మంత్రియుక్తి



సోమశేఖర మహారాజు కింద అనేక దేశాలు ఉండేవి. వాటిని ఆయన సామంతులు పరిపాలించేవారు. సోమశేఖరుడు పరిపాలనలో చాలా సమర్థుడు. తన సామంతులు కూడా తనలాగే తమ తమ దేశాలను సమర్థతతో పరిపాలించాలని ఆయన అభిప్రాయం. అందుచేత ఆయన అప్పుడప్పుడూ తన సామంతులు పరిపాలించే దేశాలకు వెళ్ళి, అక్కడ పరిపాలన ఎలా సాగుతున్నదీ స్వయంగా చూసి, తన సామంతుడు అసమర్థుడని తోస్తే, అతణ్ణి తొలగించి, అతడి స్థానంలో సమర్థుడని తనకు తోచినవాణ్ణి నియమించేవాడు.

ఒకసారి సోమశేఖరుడు మణిపుర రాజ్యాన్ని పర్యటించటానికి వెళ్ళాడు. ఆ సమయంలో మణిపురాన్ని పాలిస్తున్న చంద్రవర్మ ఏమంత తెలివితేటలు గలవాడు కాదు. అయితే ఆతని మంత్రి సుమంతుడు మంచి మేధావి. దురదృష్టవశాన, సోమశేఖరుడు పర్యటించటానికి వచ్చే సమయానికి మణిపుర రాజ్య పరిస్థితి అంత బాగాలేదు. సోమశేఖరుడికీ, అతని పరివారానికీ మంత్రి సుమంతుడు అద్భుతమైన ఆతిథ్యమూ, వినోదాలు ఏర్పాటు చేశాడు. ఆ విధంగా మణిపుర రాజ్య పరిస్థితిలో గల లోపాలు సోమశేఖరుడి కంట పడకుండా ఉంటాయని మంత్రి ఉద్దేశం.

ఆయన ఊహించినట్టే, సోమశేఖరుడు తనకు జరిగిన ఆతిథ్యానికి చాలా సంతోషించాడు. అయితే, మణిపుర రాజైన చంద్రవర్మ అమాయకత్వం మూలాన ఒక జరగరాని పొరపాటు జరిగిపోయింది. సోమశేఖరుడు వచ్చిన రాత్రి విందు వినోదాల అనంతరం ఆయనతో చంద్రవర్మ చదరంగం ఆడి ఆటలో సోమశేఖరుణ్ణి ఓడించాడు. సోమశేఖరుడి ముఖం నల్లగా అయిపోయింది. మంత్రి సుమంతుడి గుండెల్లో రాయి పడింది. సార్వభౌముణ్ణి గెలవనియ్యాలన్న జ్ఞానం లేకపోయినందుకు చంద్రవర్మ తన సింహాసనాన్నే పోగొట్టుకోవచ్చు. అలాంటి ప్రమాదం జరగకుండా ఉండేందుకు ఏమి చెయ్యాలా అని సుమంతుడు దీర్ఘంగా ఆలోచించాడు.

మర్నాడు మణిపుర దర్బారులో సోమశేఖరుడు అగ్రస్థానంలో కూర్చున్నాడు. సామంతుడు చంద్రవర్మ ఆయన సమీపంలోనే మరొక ఆసనం మీద కూర్చుని, తన కింది ముఖ్యోద్యోగులను సోమశేరుడికి పరిచయం చేస్తున్నాడు. రాజ్య పరిస్థితులను గురించి సోమశేఖరుడు అడిగిన ప్రశ్నలకు వాళ్ళు జవాబులు చెబుతున్నారు.

ఆ సమయంలో ఒక యువకుడు సభలోకి వచ్చి, ‘‘మహా ప్రభూ! నేను చదరంగ నిపుణుణ్ణి. మాది విదర్భ. దేశదేశాలు తిరుగు తున్నాను. ఇంతవరకు నన్ను చదరంగంలో ఓడించినవాడు లేడు. సెలవైతే నా నైపుణ్యం ప్రదర్శించగలను. ఈ సభలో చదరంగం ఆడగల వారున్నారా?’’ అన్నాడు.

సోమశేఖరుడు చదరంగం పోటీకి అనుమతించిన మీదట, సభలో ఆ ఆట బాగా వచ్చిన వారందరూ ఒకరొకరుగా వచ్చి అతనితో చదరంగం ఆడి ఓడిపోయారు.

‘‘ఇక్కడ కూడా నన్ను ఓడించగలవారు లేరన్నమాట! ఏం చేసేది? వచ్చిన దారినే విదర్భకు తిరిగిపోతాను’’ అన్నాడా యువకుడు.

‘‘మా చంద్రవర్మ మహారాజుగారు గొప్ప చదరంగ నిపుణులు. వారితో ఆడు, తప్పక ఓడిపోతావు! ఆయనను ఓడించినవారు ఇంత వరకు ఎవరూ లేరు’’ అన్నాడు మంత్రి సుమంతుడు యువకుడితో.

ఆ యువకుడు చంద్రవర్మతో మూడు ఆటలు ఆడి, మూడు సార్లూ చంద్రవర్మను చిత్తుగా ఓడించాడు. ఇది చూసిన సభికులకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు.

‘‘ఇంక నన్ను చదరంగం ఆటలో జయించగలవారు సభలో ఎవరూ లేనట్టేగదా! ఇక సెలవు తీసుకుంటాను’’ అన్నాడు యువకుడు దర్పంగా.

‘‘తొందరపడకు. నీ శక్తి ఏమిటో సోమశేఖర మహాప్రభువు గారి మీద చూపించు’’ అన్నాడు మంత్రి సుమంతుడు.

సోమశేఖరుడు ఆ యువకుడితో ఆడక తప్పలేదు. మొదటి ఆట ప్రారంభమైన కొద్ది నిమిషాలకే యువకుడి ఆట కట్టింది. యువకుడి ముఖం చిన్నబోయింది. అతను మరొక ఆట ఆడమని సోమశేఖరుణ్ణి వేడుకున్నాడు. ఈసారి యువకుడి ఆట మరింత తొందరగా కట్టింది. యువకుడు సోమశేఖరుడికి జోహారు చేస్తూ, ''ఏలినవారి లాంటి ఆటగాణ్ణి నేనెక్కడా చూడలేదు. నా ప్రగల్భాలను మన్నించండి!'' అని సెలవు తీసుకుని దించిన తల ఎత్తకుండా సభనుంచి బయటికి వెళ్ళిపోయాడు.

సోమశేఖరుడి ముఖాన విజయగర్వం తాండవించింది.

"బతికామురా దేవుడా!'' అనుకున్నాడు మంత్రి సుమంతుడు.

ఆ రాత్రి ఆయన ఇంటికి వెళ్ళగానే ఆయన మేనల్లుడు, ''ఏమిటి మామయ్యా! ఎన్నడూ చదరంగంలో ఓడని నన్ను ఆ మహారాజు మీద ఓడమన్నావు?'' అని చిరాకు పడ్డాడు.

''నువు మా రాజుగారి పదవి నిలబెట్టావురా! రేపే సోమశేఖర మహారాజు తిరిగి వెళ్ళిపోతున్నారు. ఆయన ఎంత ఆనందంలో వున్నాడో చెప్పలేను'' అంటూ సుమంతుడు జరిగినదంతా మేనల్లుడికి చెప్పాడు.






పూర్వం మధురలో సకల శాస్త్రాల్ని చదివిన దేవశర్మ అనే మహాపండితుడు ఉండేవాడు. అతడివద్ద వల్లభుడనే శిష్యుడు విద్యాభ్యాసం చేస్తూ ఉండేవాడు.

వల్లభుడు బద్ధకస్తుడే కాకుండా తొందరపాటు కూడా ఉన్నవాడు. దేవశర్మ ఏరోజు పాఠాలు ఆరోజు అప్పగించాలని చెప్పినా, బద్ధకించి చదవక గురువుగారి చేత చీవాట్లు చెంపదెబ్బలు తినేవాడు.

తొందరపాటుతో ఉక్రోషం పెంచుకునేవాడు. కావాలనే గురువుగారు కక్ష సాధిస్తున్నారనీ, తనపై ఎంత మాత్రమూ అభిమానం లేదనీ అనుకుంటూ ఉండేవాడు.

శిష్యుడి వాలకం వింతగా తోచినా అంతగా పట్టించుకునేవాడు కాదు దేవశర్మ.

ఇలా ఉండగా ఒకనాడు దేవశర్మ అవసరమైన పనిమీద పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. వెళ్ళేటప్పుడు శిష్యుణ్ణి పిలిచి, ''వల్లభా! నేను వచ్చేటప్పటికి పది రోజులు కావచ్చు. జాగ్రత్తగా శ్లోకాలు వల్లించు, నీతోపాటు వీడిని కూర్చోబెట్టుకుని అక్షరాలు దిద్దించు'' అంటూ ఆరేళ్ళ తన కొడుకును అప్పగించాడు. ''సరిగ్గా గమనించక పోయావో, వీడు ఆటల్లో పడిపోతాడు" అని కూడా హెచ్చరించాడు.

గురువుగారు వెళ్లిన దగ్గరనుంచీ వల్లభుడు తాను చదువుతూ తనతోపాటు గురువుగారి అబ్బాయిచేత కూడా అక్షరాలు దిద్దించ సాగాడు. గురువుగారు ఆ అబ్బాయి బాధ్యతను తనకు అప్పగించ టాన్ని గౌరవంగా భావించాడు. తన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించాలనుకున్నాడు.

కానీ వల్లభుడి కోరిక నెరవేరలేదు. నాలుగు రోజులు గడిచినా గురువుగారి పుత్రుడికి అక్షరాలు రాలేదు. వాడి ధ్యాస అంతా ఆటల మీదే ఉన్నది. చేతిలో పలక ఉన్నా చూపులు ఎక్కడో వుంటున్నాయి.

తన గురువులాటి మహాపండితునికి ఇలాంటి శుంఠ పుత్రుడై నాడే అని బోలెడంత బాధ కలిగింది వల్లభుడికి. వాడికి ఎంతో చెప్పి చూశాడు. ప్రయోజనం ఏమీ లేకపోయింది.

మరో నాలుగు రోజులు గడిచాయి. గురువుగారి పుత్రుడు దారినపడే మార్గమేదీ కనిపించలేదు. వల్లభుడికి కోపం ముంచు కొచ్చింది. వాడి చెంప ఛెళ్లుమనిపించాడు. ఆ తర్వాత వణుకు పుట్ట సాగింది వల్లభుడికి. గురువుగారికి ఈ సంగతి తెలిస్తే ఇంకేమన్నా ఉందా?

పది రోజులు కాగానే దేవశర్మ వచ్చాడు. రాగానే పిల్లవాడు తండ్రికి చెంప చూపి, జరిగింది చెప్పాడు. "అక్షరాలు దిద్దకపోతే కొట్టక ముద్దెట్టుకుంటారా?" అన్నాడు దేవశర్మ.

"బాగుంది మీ వరస. బుగ్గ బూరెలా పొంగిపోతే ఆ వల్ల భుడ్ని దండించక పిల్లాణ్ణి కసురుకుంటారేం?" అని అడిగింది దేవ శర్మను అతడి భార్య.

"చదువు దగ్గర గారాలేమిటి? తిట్టకుండా కొట్టకుండా ఏ భయమూ లేకుండా చదువు సంధ్యలు అబ్బుతాయా? కసిరినా, కొట్టినా తిట్టినా ఏ గురువైనా తన శిష్యుడి అభివృద్ధినే గదా కోరుకుంటాడు. ఎక్కడైనా ముద్దు ముచ్చట్లు గాని విద్యాభ్యాసంలో ముద్దుముచ్చట్లు పనికిరావు. వాడి సంగతి నేను చూసుకుంటాను. నువ్వు ఇంట్లోకి ఫో" అంటూ జవాబిచ్చాడు దేవశర్మ.

అంతా విన్న వల్లభుడికి గురువుగారి హృదయం అర్థమైంది. పశ్చాత్తాపం కలిగింది. అటు తరువాత శ్రద్ధాసక్తులతో శాస్త్రాలను అభ్యసించి మహాపండితుడవడమేగాక తన శిష్యుల అభివృద్ధికి కూడా పాటుపడ్డాడు.




ఒక ఊళ్ళో ఒక వ్యాపారికి ఇద్దరు కొడుకులు. చిన్నవాడు పొరుగూరు వెళ్ళి ఉన్న సమయంలో వ్యాపారికి ప్రాణం మీదికి వచ్చింది. అతను పెద్దవాడితో, ''నాయనా, నేను బతకను. ఇంత వరకూ కలిసి ఉన్నట్టే, నేను పోయాక కూడా నువ్వూ, తమ్ముడూ కలిసి వుండండి. వాడిది చిన్నప్పటినుంచీ చాలా దుడుకు స్వభావం. అందుచేత నువ్వే వాడితో ఏదో విధంగా సర్దుకుపోవాలి'' అని చెప్పి ప్రాణాలు వదిలాడు.

ఆఖరు క్షణంలో తన మామగారు తన బావగారితో ఏదో అన్నట్టు చిన్నవాడి భార్య గమనించింది. కాని వాళ్ళు ఏమి మాట్లాడు కున్నదీ ఆమెకు తెలియదు. తెలుసుకునే అవకాశం లేకుండా వ్యాపారి ఆ వెంటనే మరణించటం జరిగింది. ఊరికి వెళ్ళిన చిన్నవాడు వచ్చాడు. అన్నదమ్ములు తమ తండ్రికి దహన సంస్కారం చేశారు.

తరవాత చిన్నవాడితో వాడి భార్య "మీ అన్నగారు మీతో ఏమైనా అన్నారా?" అన్నది.

"దేనిని గురించి?" అని చిన్నవాడు భార్యను అడిగాడు.

"మీకు ఏమీ తెలియదు! చనిపోయేముందు మామగారు బావ గారితో ఏదో గుసగుసలాడారు. ఎక్కడన్నా డబ్బు దాచివుంచి ఆ విషయం పెద్దకొడుక్కు చెప్పుకున్నారేమో! ఆయన ఆ సంగతి మీతో అనకపోవడం వల్ల నాకు అనుమానంగా ఉన్నది" అన్నది చిన్నవాడి భార్య.

"మా అన్న అలాటివాడు కాడు" అన్నాడు చిన్నవాడు.

"డబ్బు దగ్గిర ఎవరు ఎలాటి వారో చెప్పడం కష్టం" అన్నది వాడి భార్య.

ఆమెకు ఉమ్మడి కాపురం సుతరామూ ఇష్టంలేదు. మామగారు బతికి ఉన్నంతకాలమూ ఆమె అన్నదమ్ములను చీల్చలేకపోయింది. ఇప్పుడు మామగారు పోవడమే గాక, అన్నదమ్ముల మధ్య భేదం ఏర్పడడానికి ఒక ఆధారం కూడా దొరికింది. ఆమె వేసిన విషబీజం చిన్నవాడి మనసులో నాటుకుని, వృద్ధిచెందసాగింది.

వాడు ఒకరోజు పెద్దవాడితో "నాన్న చనిపోయేముందు నీకు ఏదో చెప్పాడట, ఏమిటది?" అన్నాడు.

''ఏముందిరా? తాను పోయినాక కూడా మనం ఇలాగే కలిసి ఉండాలన్నాడు'' అన్నాడు పెద్దవాడు.

చిన్నవాడికి తృప్తి కలగలేదు. వాడి అసంతృప్తిని వాడిభార్య పనికట్టుకుని పెంచింది. ఒకరోజు వాడు పెద్దవాడితో వేర్లు పడదామన్నాడు.

"అంత అవసరం ఏమొచ్చిందీ?'' అని పెద్దవాడు అడిగాడు.

చిన్నవాడు తనకు తన అన్నపట్ల ఉన్న అనుమానం బయట పెట్టేశాడు. పెద్దవాడికి నోటమాట రాలేదు. వాడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చి, తన భార్య ఒంటిమీది నగలన్నీ తీసుకుని వడ్డీవ్యాపారి వద్దకువెళ్ళి, వాటిని తాకట్టు పెట్టుకుని ఇయ్యగలిగినంత సొమ్ము ఇయ్యమన్నాడు. వడ్డీవ్యాపారి వాడికి డబ్బు ఇచ్చాడు.

వడ్డీవ్యాపారి కొడుకు పెద్దవాడికి చిన్ననాటి నుండి స్నేహితుడు.

"డబ్బు ఇంత అవసరంగా ఎందుకు కావలసి వచ్చిందిరా?'' అని వాడు పెద్దవాణ్ణి అడిగాడు.

పెద్దవాడు చెప్పటానికి సంశయించాడు. వడ్డీవ్యాపారి కొడుకు, "నాకు కూడా చెప్పరానంత రహస్యమా ఏమిట్రా?'' అన్నాడు.

''మళ్ళీ ఎక్కడా అనకు. మా నాన్న నాకు ఏదో నిధినిక్షేప రహస్యం చెప్పి పోయాడని మాతమ్ముడికి అనుమానం. ఆ కారణంగా వాడు నాతో వేర్లు పడటానికి సిద్ధమవుతున్నాడు. వాడికి కావలసిన నిధి నేనే సృష్టించి,మా నాన్న కోరిన ప్రకారం ఇద్దరమూ కలిసివుండే ఏర్పాటు చేస్తాను''అంటూ పెద్దవాడు తన పథకం మిత్రుడికి చెప్పాడు.

పెద్దవాడు తాను తెచ్చిన డబ్బును మూటగట్టి, అర్ధరాత్రివేళ పెరట్లో ఒకచోట గుంట తవ్వి, అందులో మూట పూడ్చి పెట్టాడు.

మర్నాడు వాడు చిన్నవాడితో, "తమ్ముడూ ! నన్ను క్షమిస్తే, ఒక విషయం నీకు చెప్పాలి. పోయేముందు నాన్న తాను పెరట్లో దాచివుంచిన నిధి గురించి చెప్పి, దాన్ని మనిద్దరినీ తీసుకోమన్నాడు. నేను దురాశకుపోయి, ఆ సంగతి నీకు చెప్పలేదు. నాన్న రాత్రి నాకు కలలో కనపడి నన్ను నానా మాటలూ అన్నాడు; నేను చేసిన తప్పుకు శిక్షగా, ఆ మొత్తం నువే తీసేసుకోవాలనీ, మనం కలిసి ఉండకపోతే తన ఆత్మకు శాంతి లేదనీ అన్నాడు'' అని చెప్పాడు.

వెంటనే చిన్నవాడు, ''చాలా తమాషాగా ఉన్నదే! నాన్న నాకు కూడా రాత్రి కలలో కనిపించి, 'ఒరే, మీ అన్న దురాశాపరుడని అపార్థం చేసుకున్నావు! నీ మనసులో తనమీద ఉన్న దురభిప్రాయాన్ని పోగొట్టడానికీ, ఉమ్మడి సంసారం నిలబెట్టడానికీ, వాడు తన భార్య నగలు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చి, దాన్ని పెరట్లో పాతిపెట్టి, నీకు అర్పించాలనుకున్నాడు! ఇప్పటికైనా కళ్ళు తెరిచి, నీ మనసు మార్చుకొని, వాడికి క్షమాపణ చెప్పుకో' అన్నాడు" అని చెప్పాడు.

పెద్దవాడు వాడి మాటలు విని, తన రహస్యం తమ్ముడికి తెలిసిపోయినందుకు నివ్వెరపోయాడు.

అన్న ఆశ్చర్యం చూసి చిన్నవాడు నవ్వు ఆపుకోలేక, ''ఎందుకు ఆశ్చర్యం? నిన్న సాయంకాలం వడ్డీవ్యాపారి కొడుకు నాతో అంతా చెప్పేశాడు. చచ్చేట్టు చీవాట్లు పెట్టాడు కూడా! నాకు బుద్ధి వచ్చింది. మనం ఎన్నటికీ విడిపోము'' అన్నాడు.




వరలక్ష్మి అనే సంపన్నురాలికి ఒకడే కొడుకు చంద్రశేఖరుడు. చంద్రశేఖరుడి చిన్నతనంలోనే తండ్రి పోయాడు. అప్పటి నుంచీ వరలక్ష్మి వాణ్ణి ఎంతో శ్రద్ధగా పెంచి, వాడిమీదనే ఆశలన్నీ పెట్టుకున్నది. చంద్రశేఖరుడికి యుక్తవయసు రాగానే వరలక్ష్మి వాడికి సుభద్ర అనే పిల్లను పెళ్ళిచేసి, కోడలిని కాపురానికి తెచ్చుకున్నది.

సుభద్రకు అత్తవారింటి పద్ధతులు అన్నీ తృప్తికరంగానే వున్నాయి గాని, తన అత్తగారి దాతృత్వం మటుకు అసంతృప్తి కలిగించింది. ఆమె తనకున్న దాంట్లో కొంచెం హెచ్చుగానే దాన ధర్మాలు చేసేది. అంత మాత్రాన సుభద్ర లోపల బాధపడవలసిన పనిలేదు. ఎందుకంటే, వరలక్ష్మికి గల ఆస్తి ఒకంతట తరిగేది కాదు. కాని సుభద్రలో పిసినారితనం ఉన్నది. తన భర్త ఎంతో కష్టపడి సంపాదించినదంతా అత్తగారు దానధర్మాల కింద తగలేస్తున్నట్టు సుభద్ర బాధపడింది.

ఈ బాధను ఎంతోకాలం తన మనసులో ఇముడ్చుకోలేక ఒకనాడు పైకి వెళ్ళగక్కింది సుభద్ర.

"మనకు ఉన్నదాంట్లో నలుగురికి పెట్టడం తప్పుకాదమ్మా. ఉన్న ఆస్తి పాస్తులన్నీ కట్టుకు పోలేం గద!" అన్నది వరలక్ష్మి.

వరలక్ష్మి ఆ మాట అన్నా సుభద్ర గ్రహించక, అత్తగారి దానధర్మాలకు చిరాకుపడుతూ వచ్చింది. చివరకు వరలక్ష్మి ప్రాణం విసిగి, "నువ్వు నీ పుట్టింటి నుంచి తెచ్చినదేదీ నేను వృధా చెయ్యటం లేదులే, దిగులు పడకు," అన్నది.

ఇక అత్తగారిని మార్చటం తనవల్ల కాదని గ్రహించి, సుభద్ర తన మొగుడితో, "చూశారా, మీ అమ్మ ధోరణి? ఆవిడ ఇలాగే చేస్తుంటే మనకు చిప్ప చేతికి వస్తుంది. ముందు జాగ్రత్త పడటం తప్పా? మీరు ఆవిణ్ణి కాస్త హెచ్చరించండి," అన్నది.

"ఆవిడకు నువ్వా, నేను చెప్పగల వాళ్ళమా?" అని చంద్ర శేఖరుడు మొదట్లో భార్యమాట లక్ష్యపెట్టలేదు. కాని సుభద్ర అతని

మనసుని అరగదియ్యటం మానలేదు. చివరకు అతను తన భార్య దారిలోకి రానే వచ్చాడు.

''నువ చెప్పేది బాగానే వున్నది. కాని నన్ను ఏం చెయ్య మంటావు?'' అన్నాడు చంద్రశేఖరుడు భార్యతో.

"రేపు మనకు పిల్లలు పుట్టవచ్చు. వాళ్ళ మంచి కోసమైనా మనం వేరే కాపురం పెట్టాలి,'' అన్నది సుభద్ర.

భార్యమాట విని చంద్రశేఖరుడు వేరు కాపురం పెట్టాడు. తరువాత కాలక్రమాన సుభద్ర ఒక కొడుకును కూడా కన్నది.

కొడుకు పుట్టినాక సుభద్రలో కలిగిన మార్పుచూసి చంద్ర శేఖరుడు ఆశ్చర్యపోయాడు. ఆమె తన కొడుకుదే లోకంగా జీవిస్తూ, భర్తను కూడా మరిచిపోయింది.

ఒకనాడు సాయంకాలం చంద్రశేఖరుడు ఇంటికి వచ్చేసరికి పొరుగింటి ఆమె సుభద్రతో మాట్లాడుతూ, పిల్లల పెంపకంలో తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పి, చివరకు ''మనం ఎంతో కష్టపడి సాకుతాం గాని, పెద్దయి వీళ్ళు మనని చూస్తారని ఏమీలేదు. అడ్డాల నాడు బిడ్డలు గాని, గడ్డాలనాడు బిడ్డలు కారని అందుకే అంటారు." అన్నది.

సుభద్ర ఆవేశంగా, ''ఎవరైనా అలా అవుతారేమో గాని, నా బాబును అలా కానియ్యను. తల్లిదండ్రుల ఋణం తీర్చుకునే ఉత్తముడిగా వాణ్ణి తీర్చిదిద్దటానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. తల్లితండ్రుల కష్టం మీద పెరిగి పెద్ద అయి, తన స్వార్థం తాను చూసుకునే శుంఠగా కానివ్వను వీణ్ణి!'' అన్నది.

ఈ మాటలు విన్న చంద్రశేఖరుడు మర్నాడే వేరు కాపురం రద్దుచేసి, తమ తల్లి తమతో ఉండటానికి ఏర్పాట్లు చేశాడు.

“ఇదేమిటి? మీకేమైనా పిచ్చి పట్టిందా?” అని సుభద్ర అతణ్ణి అడిగింది.

“లేదు. పట్టిన పిచ్చి వదిలింది. సుభద్రా! నువ్వు స్వార్థపరురాలివి. నీ కొడుకు తన స్వార్థం చూసుకునే శుంఠ కాకూడదు, కాని నీ భర్త అలాటి శుంఠ అయితే ఫరవాలేదన్నమాట! నేను శుంఠను కానని నిరూపించుకుంటున్నాను.” అన్నాడు చంద్రశేఖరుడు.

పొరుగింటావిడతో తాను కిందటి రోజు అన్నమాటలు గుర్తుకువచ్చి, సుభద్ర ఏమీ అనలేక పోయింది.

“చూడు సుభద్రా! నీవు నీ కొడుకును ఎంత గారాబంగా పెంచుకుంటున్నావో మా అమ్మ నన్ను అంత గారాబంగానూ పెంచి, నామీద ఆశలన్నీ పెట్టుకున్నది. నా స్వార్థం నేను చూసుకుని నా తల్లిని నిరాదరించటం తప్పుకదా?” అన్నాడు చంద్రశేఖరుడు.

సుభద్ర పశ్చాత్తాప పడింది. తరవాత ఆమె తన అత్తగారితో ఎలాంటి అరమరికలూ లేకుండా కాపురం చేసింది.



# చోరశాస్త్రం



పూర్వం ఒక గజదొంగ తన జీవితమంతా పెద్దపెద్ద దొంగతనాలలో గడిపి, ఎన్నడూ పట్టుబడకుండా తప్పించుకుంటూ, చాలా డబ్బు గడించాడు. వయస్సు మళ్ళినాక అతను దొంగతనాలు మానేసి, ధారానగరం చేరి, విదేశీ వర్తకుడనని చెప్పుకుని అక్కడ నివాసం ఏర్పాటు చేసుకుని జీవించసాగాడు. అతని పేరు ధారాదత్తుడు.

వృద్ధాప్యంలో ప్రవేశిస్తున్న ధారాదత్తుడి ఆరోగ్యం అంత బాగాలేదు. అయితే ఆ నగరంలో సోమశాస్త్రి అనే ఘనవైద్యుడు ఆయనకు అవసరమైన చికిత్సలు చేస్తుండేవాడు.

ఇంతలో సోమశాస్త్రి ఆకస్మికంగా చనిపోయాడు. ధారాదత్తుడు తనకు సరియైన వైద్యం చేసేవాడు ఇకలేడని భయపడ్డాడు. అయితే సోమశాస్త్రి శిష్యుడు సుమంతుడు అనేవాడు సోమశాస్త్రి స్థానంలో వైద్యం చేస్తూ, త్వరలోనే గురువు అంతటివాడు అనే కీర్తి తెచ్చుకున్నాడు.

ఈసారి అస్వస్థత కలిగినప్పుడు ధారాదత్తుడు సుమంతుడి వద్ద చికిత్స పొందటానికి బయలుదేరాడు. ధారాదత్తుడి వద్ద రంగడు అనే నౌకరు కుర్రవాడు తప్ప ఇంకెవరూలేరు. రంగడు బండి కట్టి తెచ్చి, ధారాదత్తుణ్ణి సుమంతుడి వద్దకు తీసుకుపోవటానికి బయలుదేరాడు.

మధ్య దారిలో దుకాణాల వీధిలో జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. ఒక యువకుణ్ణి స్తంభానికి కట్టేసి కొందరు చావగొట్టుతున్నారు. రంగడు బండి దిగివెళ్ళి, సంగతి తెలుసుకొని వచ్చి, ధారాదత్తుడితో చెప్పాడు. ఆ యువకుడు దొంగతనం చేయబోయి దొరికిపోయాడట. ఈ మాటచెప్పి రంగడు బండిని ముందుకు సాగించాడు.

ధారాదత్తుడికి ఆ యువకుణ్ణి చూస్తే చాలా జాలి కలిగింది. అతను అమాయకుడై ఉండాలి. చోరవిద్యలో నైపుణ్యం గలవాడు పట్టుబడ నవసరంలేదు. ధారాదత్తుడు ఎన్నో ఏళ్ళపాటు ఎంతెంతో గొప్ప దొంగతనాలు చేసికూడా ఎన్నడూ పట్టుబడలేదు.

బండి సుమంతుడి వైద్యశాల చేరింది. సుమంతుడు ధారాదత్తుడి రోగ లక్షణాలు తెలుసుకుని మందు ఇచ్చాడు. తరవాత ఇద్దరూ కబుర్లలోకి దిగారు.

"సోమశాస్త్రి గారు పోయాక మళ్ళీ అంతటి ఘన వైద్యుడు పుట్టడని అందరూ అనుకొన్నారు. కాని నువ్వు ఆయన లేని లోటు తీర్చడం చాలా గొప్ప విషయం" అన్నాడు ధారాదత్తుడు.

"అదికూడా గురువుగారి చలవే. ఆయన పోయేముందు, తాను నేర్చుకున్నదీ, అనుభవపూర్వకంగా తాను తెలుసుకున్నదీ, యావత్తూ వివరంగా రచించి ఒక గొప్ప వైద్యశాస్త్ర గ్రంథంగా తయారు చేశారు. దాని సహాయంతో నేను రోగులకు చికిత్సలు చేయగలుగుతున్నాను," అన్నాడు సుమంతుడు.

ధారాదత్తుడు సుమంతుడి వద్ద సెలవు పుచ్చుకొని ఇంటికి వచ్చాడు. సుమంతుడిచ్చిన ఔషధం చాలా బాగా పనిచేసినట్టు కనబడింది. అతనికి ఒక ఆలోచన వచ్చింది. ప్రశస్తమైన వైద్యశాస్త్ర గ్రంథం ఉండబట్టేగదా సుమంతుడు ఒక ఘన వైద్యుడి అడుగుజాడలలో వైద్యవృత్తి కొనసాగించ గలుగుతున్నాడు! అలాగే చోరశాస్త్రం గురించి ఒక సమర్థుడు గ్రంథం రాస్తే, తాను వీధిలో చూసిన యువకుడిలాగా అసమర్థులైన దొంగలు పట్టుబడటమూ, క్రూరమైన శిక్షకు గురికావటమూ జరగదు కదా! తనకున్న అపారమైన చోరానుభవమూ, నైపుణ్యమూ వివరించుతూ చోరశాస్త్ర గ్రంథం రచించ నిశ్చయించాడు ధారాదత్తుడు.

అతను తన అనుభవాలన్నిటినీ నెమరు వేసుకొని, చోరుడికి ఎదురయ్యే సమస్యలన్నీ జ్ఞాపకం తెచ్చుకుని, తాను వాటినన్నిటినీ

ఎలా పరిష్కరించుకున్నాడో వివరిస్తూ చోరశాస్త్రం వ్రాయటం మొదలు పెట్టాడు. కొంతకాలానికి గ్రంథం పూర్తిఅయింది.

ధారాదత్తుడు పుస్తకం వ్రాస్తున్నాడన్న సంగతి రంగడికి తెలుసు. అది చోరశాస్త్రమని కూడా వాడు పసికట్టాడు. చోర విద్యలో తన యజమానికి ఇంత నైపుణ్యం ఎలా వచ్చిందో వాడు గ్రహించాడు. అయితే, రంగడు తన రహస్యం గ్రహించలేదనీ, గ్రహించినా వాడి వల్ల అపాయం జరగదనీ ధారాదత్తుడు నమ్మాడు.

రంగడు అవకాశం దొరికినప్పుడల్లా చోరశాస్త్రం చదువుతూ రాసాగాడు. వాడి ఆలోచనలు పరుగులు తీశాయి. ఒకనాడు వాడు చోర శాస్త్రాన్ని సంగ్రహించి యజమాని వద్దనుంచి పారిపోయాడు.

ఇది తెలుసుకుని ధారాదత్తుడు నివ్వెర పోయాడు. రంగడి లాంటి బుద్ధిమంతుడూ, విశ్వాసపాత్రుడూ ఇలా చెయ్యటం ధారాదత్తుడికి ఆశ్చర్యం కలిగించింది.

ఇది జరిగిన కొద్ది రోజులకే నగరంలో అతి తెలివిగా దొంగ తనాలు ఆరంభమయాయి. దొంగ దొరకడు. దొంగతనం జరిగిన వివరాలు వింటూంటే ధారాదత్తుడికి తన గ్రంథంలో ఉన్న వివరాలు జ్ఞాపకం వచ్చాయి. తాను పుస్తకంలో చెప్పిన మెళకువలన్నీ పాటించి దొంగతనాలు చేస్తున్నది రంగడేనని కూడా ధారాదత్తుడు గ్రహించాడు.

నానాటికీ దొంగతనాలు హెచ్చు అవుతున్నాయి. రంగడు ఏదో ఒకరోజు తన ఇల్లు దోచుకోవటానికి కూడా పథకం వెయ్యకపోడని ధారాదత్తుడు ఊహించాడు. తన యజమాని దగ్గిర ఎంత ధనం ఉన్నదీ వాడికి తెలిసినట్టు నగరంలో మరెవరికీ తెలియదు. అదీగాక వాడికి ధారాదత్తుడి నిత్యజీవితమూ, ఇల్లూ బాగా తెలుసు.

ఈ ఆలోచనతో ధారాదత్తుడికి మనశ్శాంతి లేకుండా పోయింది. చాలా రోజులు మధనపడి, అతను రంగడు తన ఇంట దొంగతనానికి వస్తే, వాణ్ణి పట్టటానికి ఒక పథకం వేశాడు.

ఈ లోపల నగరంలో దండోరా వేశారు. దొంగను పట్టి ఇచ్చిన వారికి లక్ష రూపాయలు బహుమతి ప్రకటించారు.

ధారాదత్తుడు అనుకున్నట్టే రంగడు ఒకరోజు అతని ఇంటికి దొంగతనానికి వచ్చి, ధారాదత్తుడి పన్నాగం మూలంగా పట్టుబడి పోయాడు.

ధారాదత్తుడు రంగడితో, ''ఏంరా, చోరశాస్త్రం దొంగిలించి నంత మాత్రాన నా ఇంటనే దొంగతనం చెయ్యగలననుకున్నావా ?'' అన్నాడు.

''ఆ చోరశాస్త్రాన్ని నమ్మే ఇలాగయాను. ఎందుకీ చోర శాస్త్రం ?'' అంటూ రంగడు తన సంచీలో వున్న చోరశాస్త్రాన్ని ధారాదత్తుడి మీదికి గిరవాటు వేశాడు.

రంగణ్ణి ఏం చెయ్యాలో ధారాదత్తుడికి తోచలేదు. వాణ్ణి రాజు గారికి పట్టియిచ్చి బహుమానం పుచ్చుకోవచ్చు. కాని రంగడు తన గుట్టు బయటపెట్టేస్తాడు. అందుచేత అతను రంగడితో వాత్సల్య పూర్వకంగా, "రంగా, తప్పు చేస్తే చేశావు. ఇంకెప్పుడూ ఇలా చేయకు. కష్టపడి బ్రతుకు. ఇప్పటికే చాలా డబ్బు దోచుకున్నావు. దానితో యే వ్యాపారమన్నా చేసుకో,'' అంటూ రంగణ్ణి వదిలేశాడు.

తరవాత ధారాదత్తుడు ఆలోచించాడు. రంగడు తన ఇల్లు దోస్తాడంటే తన మనశ్శాంతి ఎంతగా పాడయినదీ గుర్తు తెచ్చు కున్నాడు. చోరశాస్త్రం లోకానికి మేలుచేసే వైద్యశాస్త్రం లాంటిది కాదు. అందుచేత అతను చోరశాస్త్రాన్ని అప్పటికప్పుడే తగల బెట్టేశాడు.



3)

# అసలుకే మోసం



ఒక గ్రామంలో కామమ్మ అనే ఆమెకు ఆరేళ్ళ కొడుకు ఉండేవాడు. వాడు ఒకనాడు ఆడుకోవటానికి పోతుంటే వీధిలో ఏదో తళుక్కున మెరిసింది. అది ఒక ఉంగరం. కుర్రవాడు దాన్ని తీసుకొని ఇంటికేసి పరుగెత్తాడు.

సమీపంలోనే వీధి అరుగు మీద కూర్చుని ఉన్న రామయ్య అనే ఆయన, కుర్రాడు వంగటమూ, దేన్నో తీసుకుని పరుగెత్తటమూ

చూసి, కుర్రవాణ్ణి ఆపి, ''ఏమిట్రా నీ చేతిలో? పరుగెత్తుతున్నా వెందుకూ?'' అని అడిగాడు.

కుర్రాడు చెయ్యివిప్పి ఉంగరం చూపించి, అది తనకు దొరికిందన్నాడు.

''ఒరే, నీకెందుకు? అది నాకిచ్చి, ఈ డబ్బు తీసుకుపోయి, ఏమన్నా కొనుక్కుతిను,'' అంటూ రామయ్య కుర్రాడినుంచి ఉంగరం తీసుకొని, వాడిచేతిలో డబ్బు పెట్టాడు. కుర్రాడు ఉత్సాహంగా దానితో తినుబండారం కొని ఇల్లు చేరుకున్నాడు.

"ఎక్కడిదిరా అదీ! ఎవరిచ్చారూ?" అని తల్లి వాణ్ణి అడిగింది.

''కొనుక్కున్నాను,'' అన్నాడు వాడు.

''డబ్బులెక్కడివిరా నీకూ?'' అన్నది తల్లి.

''పక్కింటి రామయ్య ఇచ్చాడు" అన్నాడు కొడుకు.

"వెధవా, ఊళ్ళోవాళ్ళందర్నీ డబ్బులకోసం దేబిరిస్తున్నావా?" అని తల్లి కోప్పడింది.

''నేనేమీ దేబిరించలేదు. ఉంగరం తీసుకొని డబ్బు ఇచ్చాడు,'' అన్నాడు కొడుకు.

''ఉంగరమేమిట్రా, వెధవా?'' అని తల్లి వాణ్ణి కసిరింది.

కుర్రాడు బిక్కమొహం వేసుకుని జరిగినదంతా తల్లికి చెప్పాడు.

కామమ్మకు రామయ్య మీద మండుకొచ్చింది. ఆమె బయటికి వచ్చి, రామయ్యతో, ''ఏమయ్యా, ఏమిటీ బుద్ధిలేనిపనులు? ఎంతో కష్టపడి డబ్బు కూడబెట్టి, కుర్రాడికి ముచ్చటగా ఉంగరం చేయిస్తే

వాడిచేతిలో ఓ డబ్బుపెట్టి, దాన్ని కాజేస్తావా?'' అంటూ జగడానికి దిగింది.

''ఏమిటి, అక్కగారూ? ఉంగరమేమిటి? నేను కాజెయ్యట మేమిటి? ఏదో పిల్లవాడుగదా అని ఒక డబ్బు ఇచ్చాను. అంతకన్న నాకింకేమీ తెలీదు,'' అన్నాడు రామయ్య.

కామమ్మ అంత తేలికగా ఊరుకునే రకంకాదు. ఆమె నోటికి వచ్చినట్టు మాట్లాడటం మొదలుపెట్టేసరికి నలుగురూ పోగయ్యారు.

ఇంతలో ఒక పెద్దమనిషి జేబులు తడుముకుంటూ అటుగా వచ్చి, ''ఇంతకుముందు నేను ఇటుగా పోతూ ఉంగరం ఒకటి పోగొట్టు కున్నాను. మీలో ఎవరికన్నా దొరికితే ఇచ్చేస్తారా?'' అని వేడుకున్నాడు.

అక్కడ చేరినవారికి కామమ్మా, రామయ్యా ఎందుకు పోట్లాడు కుంటున్నారో అర్థమైపోయింది. వాళ్ళు అసలు విషయం ఆ వచ్చిన పెద్దమనిషి చెవిలో వేశారు.

ఆయన పోట్లాడుతున్న వాళ్ళతో, ''ఏం మనుషులు మీరు? ఎవరి సొత్తుకో ఆశపడి పోట్లాడుకుంటున్నారా? ఆ ఉంగరం నాది. దాన్ని నాకు ఇచ్చేసి తగవు మానండి,'' అన్నాడు.

కామమ్మా, రామయ్యా ఒకరి మొహం ఒకరు చూసుకుని, వెంటనే మాట మార్చేశారు.

''పోవయ్యా, పెద్దమనిషీ! మేమేదో పిల్లలవిషయమై తగాదా పడుతూంటే, మధ్యలో పానకంలో పుడకలాగా నువ్వేమిటి! నీ ఉంగరం ఇక్కడ ఎవరికీ దొరకలేదు. వెళ్ళు, వెళ్ళు!'' అన్నారు వాళ్ళు కోపంగా.

వచ్చినవాడు గట్టిపింఃసం. "ఇదా మీ ఎత్తు? రండి గ్రామాధికారి దగ్గరికి," అన్నాడు.

గ్రామాధికారి అనగానే ఇద్దరి గుండెల్లో రాయి పడింది. అయినా ఉంగరం వదులుకోవటం ఇష్టంలేక, వాళ్ళు పెద్దమనిషి గ్రామాధికారి వద్దకు వెళ్ళారు.

ఆ గ్రామాధికారి ఊరికి న్యాయాధికారి కూడానూ. అతను లంచాలు మరిగి, చాలాకాలంగా పక్షపాతపు తీర్పులు చెబుతూ వస్తున్నాడు. అయినా అతని మీద రాజుగారికి ఫిర్యాదు చేయటానికి గ్రామస్థులలో ఎవరికీ ధైర్యం లేదు.

పెద్దమనిషి గ్రామాధికారితో తన ఉంగరం సంగతి చెప్పాడు. కామమ్మా, రామయ్యా తమకు ఆ ఉంగరం సంగతి తెలియదని, ఆ పెద్దమనిషి తమను నిష్కారణంగా అల్లరి పెడుతున్నాడనీ అన్నారు. కానీ గ్రామాధికారికూడా మోసగాడే గనక, మోసం పసిగట్టి, అడ్డదిడ్డంగా ప్రశ్నలువేసి, కామమ్మచేతా, రామయ్యచేతా నిజం చెప్పించేశాడు. చెరి ఇరవై వరహాలూ జరిమానా కట్టుకుని ఉంగరాన్ని గ్రామాధికారికిచ్చి, కామమ్మ, రామయ్య వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్ళగానే, పెద్దమనిషి గ్రామాధికారితో, "అయ్యా, తమరు నాకెంతో సహాయం చేశారు. నా ఉంగరం నాకు ఇచ్చేశారంటే, నా దారిన నేను పోతాను," అన్నాడు.

గ్రామాధికారి నవ్వి, "అంత తొందరపడితే ఎలాగయ్యా? ఈ ఉంగరం నువు తీసుకపోయి, రేపు మరొకడు వచ్చి ఈ ఉంగరం తనదంటే నేనేం చెయ్యాలి? నమ్మదగ్గ రుజువు ఏదన్నాచూపి నిరభ్యం

తరంగా ఉంగరం తీసుకువెళ్ళు. అంతదాకా ఇది నావద్ద వుంటుంది,'' అన్నాడు,

చేసేదిలేక పెద్దమనిషి తల వేలాడవేసుకుని వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి గ్రామాధికారి బంగారం నగలుచేసే భద్రయ్య ఇంటికివెళ్ళి, ''చూడు, భద్రయ్యా, అత్యవసరంగా డబ్బు కావలసి వచ్చింది. అప్పు చెయ్యటం మనకు ఇంటా వంటాలేదు. నా భార్య చేతి ఉంగరం తెచ్చాను, దాని ఖరీదుకట్టి ఇయ్యి,'' అన్నాడు, ఉంగరాన్ని భద్రయ్యకిస్తూ.

భద్రయ్య దాన్ని అటూ ఇటూ తిప్పి చూసి, ''ఈ ఉంగరం నాలుగువందల వరహాలు చేస్తుంది. నా దగ్గర ఇప్పుడు రెండువందల కంటే పైకం లేదు. దీనిని మరెవరివద్దకన్నా తీసుకుపొండి,'' అన్నాడు.

ఈ విషయం ఇంకొకరికి కూడా తెలియటం దేనికని, గ్రామాధికారి భద్రయ్యతో, ''ఫరవాలేదు, భద్రయ్యా, నీ దగ్గర ఉన్నంత ఇప్పుడు ఇయ్యి. మిగతాది రేపు సాయంత్రానికి సర్దితే చాలు,'' అన్నాడు.

భద్రయ్య రెండువందల వరహాలు తెచ్చి ఇచ్చాడు. గ్రామాధికారి డబ్బు తీసుకుంటూ, ''భద్రయ్యా, ఈ సంగతి ఎక్కడా చెప్పకు,'' అన్నాడు,

మర్నాడు సాయంత్రం గ్రామాధికారి భద్రయ్య ఇంటికివచ్చి మిగతాడబ్బు అడిగాడు.

''డబ్బా, నేను మీకేం డబ్బు ఇయ్యాలి? దేనికి ఇయ్యాలి?'' అన్నాడు భద్రయ్య.

"భద్రయ్యా, నన్ను మోసం చెయ్యజూడకు. రాజుగారితో చెప్పి, నీ తల తీయించెయ్యగలను," అని గ్రామాధికారి బెదిరించాడు.

భద్రయ్య భయపడలేదు. అతను గ్రామాధికారివెంట రాజుగారి సభకు వెళ్ళి, రాజు సమక్షంలో గ్రామాధికారి చెప్పినదాంట్లో అబద్ధం లేదనీ అంతా నిజమేననీ ఒప్పుకున్నాడు.

రాజు భద్రయ్యకు పెద్ద జరిమానా విధించాడు.

"మోసగాళ్ళందరికీ మీరు జరిమానా విధిస్తున్నట్టయితే గ్రామాధికారికి కూడా విధించండి," అన్నాడు భద్రయ్య.

"గ్రామాధికారి ఏం మోసం చేశాడు?" అని రాజు ఆశ్చర్యంగా అడిగాడు.

భద్రయ్య ఆ ఉంగరం గురించి ఊళ్ళో జరిగినదంతా రాజుకు చెప్పాడు. అన్నీ అబద్ధాలేనన్నాడు గ్రామాధికారి.

అప్పుడు భద్రయ్య ఇలా చెప్పాడు:

"ఆ ఉంగరాన్ని నేను ఒక రాజోద్యోగికోసం చేసి యిచ్చాను. అది నకిలీ ఉంగరం. ఆయన నా దగ్గరకు వచ్చి, తన భార్య వజ్రపుటుంగరం కోసం పోరుపెట్టుతున్నదనీ, తనకు అంత స్తోమతు లేదనీ అన్నాడు. నేను ఆయనకు చౌకలో ఒక నకిలీ ఉంగరం చేసియిచ్చాను. దాన్ని ఆయన తీసుకుపోతూ దారిలో పోగొట్టుకున్నాడు. దాన్ని మోసంచేసి ఈ గ్రామాధికారి చేజిక్కించుకున్నాడు. నేను చెప్పిన రాజోద్యోగి ఇప్పుడు ఈ సభలో ఉన్నాడు."

భద్రయ్య ఈ మాట అనగానే ఒక రాజోద్యోగి లేచి, భద్రయ్య మాట నిజమని ఒప్పుకున్నాడు. రాజుకు గ్రామాధికారి మీద అమితమైన కోపం వచ్చింది. ఆయన భద్రయ్యతో, "గ్రామాధికారితోపాటు, నువుకూడా మోసకారివేగదా!" అన్నాడు,

భద్రయ్య నవ్వి, "మహారాజా, మా గ్రామాధికారి ఇలాటి మోసాలూ, అక్రమమైన తీర్పులూ చాలాకాలంగా చేస్తున్నాడు. ఇప్పుడు వాటిని బయటపెట్టే అవకాశం వచ్చిందిగనక ఇలా నాటకం ఆడాను. నేను మోసగాణ్ణేఅయితే నకిలీ ఉంగరానికి రెండు వందల వరహాలు ఇస్తానా?" అన్నాడు.

ఈ మాట రాజుకు నచ్చింది. ఆయన భద్రయ్య తెలివిని ఎంతో మెచ్చుకుని, గ్రామాధికారిచేత భద్రయ్యకు వెయ్యి వరహాలు ఇప్పించి, గ్రామాధికారిని పదవినుంచి తొలగించటమేగాక, కఠిన శిక్షకూడా అతనికి విధించాడు.



# మాటల్లో తేడా



ఆనందుడికి తల్లితండ్రులు చిన్ననాడే గతించారు. అతడు, వయసువచ్చాక, బ్రతుకుతెరువు వెతుక్కుంటూ ఉన్న ఊరు వదిలిపెట్టి, సోమపురానికి వెళ్ళాడు. మొదట్లో ఏవో చిల్లరపనులుచేసి పొట్టపోసుకున్నా, ఆ తరువాత చిన్న వ్యాపారాన్ని ప్రారంభించాడు. కాలం కలిసివచ్చి ఐదారు సంవత్సరాలలో పెద్దపెట్టున వ్యాపారం చేస్తూ, లక్షలు గడించ సాగాడు ఆనందుడు. డబ్బుకు ప్రాముఖ్యత ఇవ్వక,

కామాక్షి అనే గుణవంతురాల్ని పెళ్ళిచేసుకుని సుఖంగా సంసారం చేయసాగాడు.

దాదాపు ఐదారు సంవత్సరాలు గడిచాక ఉన్నట్టుండి, ఆనందుడికి తన సొంతవూరు చూడాలనిపించింది. తన చిన్ననాటి స్నేహితులు సుమంతుడు, శేఖరుడు ఎలా వున్నారో చూడదలుచుకుని సొంతవూరు బయలుదేరాడు.

ఆనందుడు, ముందుగా సుమంతుణ్ణి చూడబోయాడు. సుమంతుడు బాగా చితికిపోయినట్లు కనబడ్డాడు. సుమంతుడు చేసిన వ్యాపారాలన్నీ నష్టాన్నే తెచ్చిపెట్టాయని మాటల మధ్య తెలుసుకున్నాడు ఆనందుడు.

ఆనందుడు మిత్రుడి పరిస్థితికి ఎంతో బాధపడ్డాడు. తిరిగి వచ్చేస్తూ సుమంతుణ్ణి తప్పక సోమపురానికి ఒకసారి రమ్మని కోరాడు. సుమంతుడు తప్పక వస్తానని మాట యిచ్చాడు.

ఆ తరువాత ఆనందుడు, శేఖరుడి యింటికి వెళ్ళాడు. శేఖరుడు కోటికి పడగలెత్తివున్నాడు. ఆనందుడి రాకకు శేఖరుడు సంతోషపడి, అతనికి చక్కని ఆతిథ్యాన్ని యిచ్చాడు. సుమంతుణ్ణి అడిగినట్లుగానే శేఖరుణ్ణి కూడా తన వూరికి రమ్మని ఆహ్వానించాడు ఆనందుడు. శేఖరుడు వస్తానని మాట యిచ్చాక, సోమపురానికి తిరిగి వచ్చేశాడు ఆనందుడు.

నెలరోజులు గడిచాక ఒకనాడు సుమంతుడు, సోమపురానికి వచ్చాడు. ఆనందుడి సంపదా, పరివారమూ చూశాక సుమంతుణ్ణి అతడి దరిద్రం మరింతగా వెక్కిరిస్తున్నట్లు అనిపించసాగింది. ఈ విషయం ఆనందుడు పసిగట్టకపోలేదు.

భోజనాలు అయి విశ్రాంతిగా కూర్చున్నప్పుడు, ''మిత్రమా, నువ్వు చాలా అదృష్టవంతుడివి. చేసినవన్నీ నీకు కలిసివచ్చాయి,'' అన్నాడు సుమంతుడు, ఆనందుడితో.

ఆ మాటలు విని ఆనందుడు నవ్వి, యిలా అన్నాడు. ''బయట నుంచి చూస్తే నీలాంటి వాడికి అలానే అనిపిస్తుంది. ఒకప్పుడు నా వ్యాపారం బాగా కలిసివచ్చింది. కాని యిప్పటి పరిస్థితి వేరు. నా ఆస్తిపాస్తులు అప్పులు బేరీజు వేసుకుంటే, బహుశా అప్పులే మిగులుతాయి. నా ఆర్థిక బాధలు ఎవరికి చెప్పుకోగలను.?''

ఆనందుడి మాటలకు సుమంతుడు నివ్వెరపోయాడు. ఎంత చెట్టుకు అంత గాలి అన్నట్లు, ఎవరికి తగ్గ బాధలు వాళ్ళకు ఉంటాయి. ఆనందుడికంటే బహుశా తనే కాస్త మెరుగేమో అని భావించసాగాడు సుమంతుడు.

రెండు మూడు రోజులు ఆనందుడిఇంట సంతోషంగా గడిపాక, సుమంతుడు తిరుగు ప్రయాణమయ్యాడు.

అప్పుడు ఆనందుడు, పదివేల వరహాల మూట నొకదాన్ని సుమంతుడి చేతిలో పెడుతూ, ''కాదనకుండా తీసుకో. మొహమాటం వద్దు. ఈ డబ్బుతో ఏదైనా వ్యాపారం మళ్ళా ప్రారంభించు. కాలం కలిసివస్తే, యీ డబ్బు తిరిగి యిద్దువుగానిలే,'' అంటూ బలవంత పెట్టాడు. సుమంతుడికి ఆ డబ్బు తీసుకోక తప్పిందిగాదు.

సుమంతుడు సోమపురం వచ్చి వెళ్ళిన వారం రోజులకు శేఖరుడు ఆనందుణ్ణి చూడటానికి సోమపురం వచ్చాడు.

ఆనందుడి భవంతి, పరివారం, సంపద చూసి కోటికి పడగలెత్తిన శేఖరుడు పెదవి విరిచాడు. ఆ మాటే అంటూ, ''మిత్రమా,

నువ్వు ఎంతో సంపాదించావనుకున్నాను. నువ్వుండే యీ భవంతీ, పరివారమూ అవీ చూస్తే నాకు అలా అనిపించటం లేదు,'' అన్నాడు నిస్పృహతో.

ఆనందుడి స్థితిగతులు కోటికి పడగలెత్తిన శేఖరుడికి చాలా తక్కువని తోచాయి.

మిత్రుడి మాటలకు ఆనందుడు నొచ్చుకోకుండా, యిలా అన్నాడు. ''నువ్వన్న మాటల్లో అంతగా నిజం లేదు. ఈ భవంతిలో నేను ఉండటానికి కారణం, యిది నాకు బాగా కలిసివచ్చిన భవంతి. ఈ భవంతిలోనే వుండి వ్యాపారం కొనసాగిస్తే మరింతగా సంపాదించగలననే నమ్మకం వల్ల యిందులో వుంటున్నాను. ఈ ఊళ్ళో నాకు ఆకాశానికంటే భవనాలు నాలుగున్నాయి. ఈ ఊరి వెలుపల యీ మధ్యనే పెద్ద తోట కొని, అందులో ఇంద్రభవనంలాంటి విశ్రాంతి భవనం కట్టిస్తున్నాను. సంపాదించినదాంతో తృప్తివుండదంటారు గదా! ప్రస్తుతం నేను తూర్పు దీవులకెళ్ళి వజ్రాల వ్యాపారం చెయ్యబోతున్నాను.''

ఆనందుడు తన స్థితిగతులను బాగా ఎక్కువ చేసుకుని మాట్లాడాడు.

ఆ తరువాత మిత్రులిద్దరూ కులాసాగా నాల్గురోజులు గడిపారు. ఐదవరోజు శేఖరుడు తన ఊరికెళ్ళిపోయాడు.

ఆనందుడు, సుమంతుడితో మాట్లాడిన ధోరణిలోను, శేఖరుడితో మాట్లాడిన ధోరణిలోనూ ఎంతో వ్యత్యాసముంది.

ఈ విషయం గుర్తుచేస్తూ కామాక్షి భర్తను అలా మాట్లాడ్డంలో మీ ఉద్దేశం ఏమిటని అడిగింది.

ఆనందుడు భార్య సునిశితబుద్ధికి మెచ్చుకున్నట్లు చూసి, యిలా అన్నాడు:

''మన యింటికి అతిధిగా వచ్చిన సుమంతుడు మన సంపదను, ఐశ్వర్యాన్ని చూసి, తన దారిద్ర్యంతో మనల్ని పోల్చుకుని బాధ పడుతున్నట్టు గమనించాను. మనం సర్వసుఖాలు అనుభవిస్తున్నామని అతను అనుకోవటంవల్ల, అతని బాధా, దుఃఖం రెట్టింపు అయే ప్రమాదం వుంది. ఇక్కడ వున్న రెండు రోజులూ మనశ్శాంతి కోల్పోయి, నాతో సరదాగా గడపలేక పోయేవాడు. అందువల్లనే నాకున్న చిన్న ఇబ్బందుల్ని పెద్దవిగా కల్పించి చెప్పాను. నేనుకూడా కష్టాలు అనుభవిస్తున్నానని అతను అనుకోవాలనే అలా అన్నాను. అందువల్లే రెండురోజులు సుమంతుడుహాయిగా నాతో గడపగలిగాడు. అతడు పైకిరావాలని మిత్రుడిగా ఆశించి నేను అతనికి పదివేల వర హాలు యిచ్చి సహాయపడ్డాను.

''ఇక శేఖరుడి సంగతంటావా? వాడు కోటికి పడగలెత్తిన వాడు కావడంవల్ల అతడికి మనమీద చిన్నచూపు పడే అవకాశముంది. అందుకనే మన స్థితిగతులను మరింత పెద్దవిగా చేసి చెప్పి అతని తాహతుకు మనం తూగగల మనిపించాను. జరిగింది యింతే!

"ఇందులో ఒకర్ని మోసం చెయ్యడంగాని, మరొకరితో అసత్యం చెప్పడంగాని ఏమీ లేదు. మాటల్లో కొంత లౌక్యం ఉపయోగించాను, అంతే!''

# అసూయ



పూర్వం రామాపురం అనే గ్రామంలో బొమ్మలు చెయ్యటంలో ప్రసిద్ధికెక్కిన శిల్పి ఒకడు ఉండేవాడు. రామదత్తుడూ, సోమదత్తుడూ అని అతనికి ఇద్దరు కొడుకులు ఉండేవాళ్ళు. వీరిద్దరూ పెద్దవాళ్ళయిన తరువాతనే తండ్రి పోయాడు. అప్పటికి రామదత్తుడు బొమ్మలు చెయ్యటంలో తండ్రి అంతటి వాడయ్యాడు. తండ్రి నడిపిన బొమ్మల దుకాణాన్ని రామదత్తుడే విజయవంతంగా నడపసాగాడు.

రెండోవాడైన సోమదత్తుడు బొమ్మలు చెయ్యటం నేర్చుకో లేదు. చదువుమీద ఆసక్తివుండి చదువుకున్నాడు. పదహారేళ్ళు వచ్చేసరికి అతను తమ గ్రామంలో ఉండే గురువులవద్ద విద్యాభ్యాసం పూర్తిచేశాడు. పెద్ద చదువులు చదవటానికి అతని అన్న మధురా నగరం వద్దఉండే జగన్నాథ పండితుడి వద్దకు పంపాడు.

జగన్నాథ పండితుడివద్ద చాలా మంది శిష్యులుండేవారు. అయినా సోమదత్తుడు ఆయన శిష్యులలో చాలా తెలివిగల వాడనే పేరు తెచ్చుకున్నాడు. దానితో సోమదత్తుడిలో గర్వమూ, అహం కారమూ పెరిగాయి.

ఇంతలో జగన్నాథ పండితుడివద్దకు ఆనందుడనే మరొక శిష్యుడు వచ్చి చేరాడు. ఈ ఆనందుడు అపారమైన తెలివితేటలూ, ప్రజ్ఞా, ప్రశాంతతా, చక్కని ప్రవర్తనా కలవాడు. అతడి తెలివి తేటలకూ అందరూ ఆశ్చర్యపడి, అతన్ని ఎంతో ఆదరంతోనూ, గౌరవంతోనూ చూడసాగారు.

ఆనందుడు అన్నివిధాలా తనకన్న తెలివిగలవాడు కావటం చూసి సోమదత్తుడికి అసూయ కలిగింది. అది క్రమంగా క్రోధంగా మారింది. అయితే సోమదత్తుడు ఈ విషయాన్ని తనలోనే దాచుకుని పైకి ఏమాత్రమూ కనబడనియ్యలేదు.

ఒకనాడు జగన్నాథ పండితుడి శిష్యులందరూ సమిధలు మొద లైన వాటికోసం అరణ్యానికి వెళ్ళారు. సోమదత్తుడు ఆనందుడి భుజంమీద చేయివేసి, ఆప్యాయంగా మాట్లాడుతూ, మిగిలిన శిష్యుల నుంచి వేరుచేసి, ఒక నిర్జన ప్రాంతానికి తీసుకువెళ్ళాడు. అతడు ఆనందుణ్ణి కాలిమీద తన్ని వెల్లకిలా పడేసి, దగ్గరలో ఉన్న ఒక

పెద్దరాయి ఎత్తి, "ఈ రోజుతో నాకు నీ పీడ వదులుతుంది," అంటూ అరిచి, ఆనందుడి తల పగలగొట్టబోయాడు.

ఇంతలో "ఆగు! ఆగు! ఏమిటిది?" అంటూ కొందరు శిష్యులు అటుగా వస్తూ కేకలు పెట్టారు.

సోమదత్తుడు రాయి అవతల పారేసి కాలిసత్తువకొద్దీ పారిపోయాడు.

దిగాలుపడి ఇంటికి వచ్చిన తమ్ముణ్ణి చూసి రామదత్తుడు, "ఎందుకురా అలా ఉన్నావు? నీ చదువు అయిపోయిందా?" అని ఆత్రంగా అడిగాడు.

సోమదత్తుడు తన అన్నకు జరిగినదంతా చెప్పి బావురుమన్నాడు. అంతావిని రామదత్తుడు తమ్ముణ్ణి ఓదార్చాడు.

కొద్దికాలం గడిచింది. ఎక్కడినుంచో మరొక బొమ్మలు చేసేవాడు రామాపురం వచ్చి, రామదత్తుడి దుకాణానికి ఎదురుగా మరొక బొమ్మల దుకాణం పెట్టాడు. కొత్త వింతా, పాత రోతా అన్నట్టు, అందరూ ఆ దుకాణంలో బొమ్మలు కొనసాగారు, సోమదత్తుడుఇది చూసి,నిలకడమీద నిజం బయటపడుతుందిలేఅనుకున్నాడు.

కాని తన అన్నచేసే బొమ్మలు బాగుండటం లేదని కొందరు అనుకోవటం సోమదత్తుడు విన్నాడు. కొత్తవాడు బొమ్మలు చెయ్యటంలో నేర్పరి అయితే కావచ్చుగాని, తన అన్నచేసే బొమ్మలు బాగా ఉండకపోవటం అసాధ్యమని అతనికి అనిపించింది.

ఒకనాడు సోమదత్తుడు అన్న దుకాణానికి బయలుదేరాడు. దారిలో అతనికి, బొమ్మలు కొని వాటిని చూసి మురిసిపోతూ వచ్చే

మనిషి ఒకడు కనిపించాడు. "వాటిని ఎక్కడ కొన్నావు?" అని సోమదత్తుడు ఆ మనిషిని అడిగాడు.

"కొత్తవాడి దగ్గర కొన్నాను," అన్నాడు ఆ మనిషి.

సోమదత్తుడు ఆ బొమ్మలు తీసుకునిచూస్తే, అవి తన అన్న చేసే బొమ్మలలాగే వున్నాయి. జనం ఆ కొత్తవాడి బొమ్మలకోసం ఎందుకు ఎగబడుతున్నారో అతనికి అర్థం కాలేదు.

అతను దుకాణం చేరేసరికి రామదత్తుడు ఒక బొమ్మను చేస్తున్నాడు. అతని చేతులు పనిచేస్తున్నాయేగాని, అతని కళ్ళు ఎదురు దుకాణంలో బొమ్మలు కొంటున్నవాళ్ళమీదే ఉన్నాయి. అతని మనసు చేసేపనిమీద ఉన్నట్టులేదు. అతని పక్కనే తయారయిన బొమ్మలు కొన్ని ఉన్నాయి. వాటి తయారుగాని, రంగులుగాని ఎంతమాత్రమూ బాగాలేవు. సోమదత్తుడికి రామదత్తుడి పరిస్థితి అర్థమయింది.

రామదత్తుడు తలఎత్తి సోమదత్తుడికేసిచూసి, "ఏరా, మన దుకాణానికి ఎవరూ రావటం లేదని దిగులుపడుతున్నావా? ఇలా ఎంతో కాలం సాగదులే! గ్రామాధికారికి తృణమో, పణమో ముట్టజెప్పి, వాణ్ణి ఊళ్ళోనుంచి వెళ్ళగొట్టిస్తాను. ఆ తరువాత జనం చచ్చినట్టు మన దగ్గరే బొమ్మలు కొంటారు," అన్నాడు ఆవేశంగా.

కొత్తవాడి పోటీమూలంగా తన అన్న మనసు చెడిపోయిందనీ, అందుకే బొమ్మలు సరిగా చేయలేక పోతున్నాడనీ సోమదత్తుడు గ్రహించాడు. మరుక్షణమే అతనికి తన చెంపమీద ఎవరో కొట్టినట్టయింది. వెంటనే అతను ఇంటికి తిరిగివెళ్ళి, ఆరోజే మధురానగరానికి ప్రయాణమయిదేరి వెళ్ళాడు.

అతను జగన్నాథ పండితుడి కాళ్ళమీదపడి, క్షమాపణ చెప్పుకుని, ఆనందుడికి కూడా క్షమాపణ చెప్పుకుని, తన చదువు కొనసాగించాడు. ఆనందుడు అతనిమీద ఏ కక్ష పెట్టుకోలేదు. ఇద్దరూ ఆప్తమిత్రులయారు. చివరకు సోమదత్తుడు విద్య పూర్తిచేసుకుని, సమగ్ర పండితుడై తన వూరికి తిరిగి వచ్చాడు.

తన తమ్ముడు పండితుడై తిరిగి వచ్చినందుకు రామదత్తుడు సంతోషించి, ''చదువుమాని వచ్చినవాడివి ఎందుకు తిరిగివెళ్ళావు?'' అని అడిగాడు.

దానికి సోమదత్తుడు ఇలా అన్నాడు:

''నేను ఒక జీవిత సత్యం నేర్చుకున్నాను. మనని మించినవాణ్ణి చూడగానే అసూయ కలగటం సహజం. ఆ అసూయ పట్టుదలగా మారితే మనం పైకి రాగలుగుతాం. అది క్రోధంగా మారితే అవతలివాడి నాశనం కోరి మనం కూడా నాశనమవుతాం. నేను ఆనందుణ్ణి చూసి అసూయ పడ్డాను. నేను చేసిన పొరపాటేమిటో నీ ద్వారా తెలుసుకున్నాను. నీ పోటీదారు చేసిన బొమ్మలు అంత గొప్పవేమీ కావు. నువు తలుచుకుంటే అంతకన్న బాగా చెయ్యగలవు.''

రామదత్తుడు నవ్వి, ''నిజమే. నీకు ఆ సంగతి తెలియడం కోసమే నేను ఒక నాటకం ఆడాను. ఆ పోటీదారు పొరుగూళ్లో ఉండే నా స్నేహితుడే. వాడు అమ్మినవి నా బొమ్మలే. ఈ నాటకం నీకు లాభించింది,'' అన్నాడు.

